శ్రీరస్తు.

# శ్రీ విష్ణు సహస్ర నామ నిర్వచనము.

ఇయ్యది

విక్రమార్క చరిత్ర హరికారికా శేషసర్వస్వాది

గ్రంథకర్తయగు

బ్రహ్మశ్రీ భాగవతుల రామమూర్తి శాస్త్రులవారిచే

రచింపఁబడి

श्री विष्णु सहस्रनाम निर्वचनमु.

---

తత్పుత్రులగు

భాగవతుల వేంకటభాగవత శాస్త్రిచే

మదరాస్

"ఆనంద" ముద్రణాలయంబున ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

విజయనగరము.

1917

 [వెల రు. 1 0 0

# కృతజ్ఞత.

శ్రీ శంకరాచార్యులవారు రచియించిన శ్రీ విష్ణుసహస్రనామభాష్యమునకుఁ దెనుఁగున నిర్వచనమును మాతండ్రిగారైన బ్రహ్మశ్రీ భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు రచించిరి.

వారికాలమందే యీగ్రంథము నచ్చొత్తింత మనుకొనినను దగిన ద్రవ్యసహాయము దొరకనందున నచ్చుపడాపని నిలిచిపోయినది. పిమ్మటఁ గొంతికాలమునకు బరంపురిమునందు "సబ్జడ్జి" గా నున్నవారును సంస్కృతాంధ్రభాషావిశారదులును వేదాంతగ్రంథరచనానిపుణులును నగు బ్రహ్మశ్రీ వావిలాల వేంకటశివావధానులుగారు నాయందు దయగలవారై యీగ్రంథమును బరిశీలించి పరమానందమునుబొంది శ్రీశ్రీశ్రీ బొబ్బిలి మహారాజా జి. సి. ఐ. ఇ. వారికి దీని యుత్కృష్టత నెఱిఁగించి దీని నచ్చొత్తించుటకుఁ దగినయుత్సాహమును వారికిఁ గలిగించి నాకు వాక్సహాయముఁ జేసిరి.

శ్రీశ్రీశ్రీ మహారాజావారు నావిన్నపములను సాదరమతితో నాలకించి యీగ్రంథమును వ్రాయుచేయు ద్రవ్యసహాయ్యమున నచ్చొత్తింపవలసినదని నాకాజ్ఞయొసఁగిరి. శ్రీశ్రీశ్రీ మహారాజావారి యాదరణమును ద్రవ్యసహాయమును నేఁబొందని యెడల నీగ్రంథ మింతవేగముగ నచ్చుపడకపోవును. కవిపోషకులునుఁ, బండితపక్షపాతులును, వితరణ గుణోదారులును,

దిగంతవిశ్రాంత యశస్కులును నగు శ్రీశ్రీశ్రీ మహారాజావారిని నాకొలది నుడులనునుగ్గడించుట సూర్యునిఁగరదీపికచేఁ జూపుట వంటిదియని నాయాశయము. శ్రీవారి యౌదార్యమునకు నెంతయుఁ గృతజ్ఞుడను. "వారికి సర్వశుభముల ననుగ్రహింపుమ"ని శ్రీకృష్ణభగవానుని సర్వదా ప్రార్థించుచున్నాను.

నాప్రార్థన నంగీకరించి తీరికకలుగఁజేసికొని యీగ్రంథము యొక్క యచ్చుచిత్తులను (Proofs) వెంటవెంటనే దిద్దియిచ్చి నాకు సాయమొనర్చిన బ్రహ్మశ్రీ-పురాణం - సూర్యనారాయణ తీర్థులవారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతుల నర్పించు చున్నాఁడను.

భాగవతుల వేంకట భాగవతశాస్త్రి.

కళాశాలాంధ్రోపాధ్యాయుఁడు,

విజయనగరము.

# శ్రీకృష్ణః

## అభిప్రాయము.

---

తే. గీ. 1. శంకరాచార్య రచితభాష్యంబునందు
దాహృతంబైనరీతి వ్యక్తిసహిత
ముగఁ దెనుంగుననర్థముల్ పొందుపఱచి
విష్ణుని సహస్రనామముల్ విశదపఱిచె
భాగవతవంశ వార్ధిజైవాతృకుండు
కీర్తిశేషుఁడు శ్రీరామమూర్తి శాస్త్రి
తెనుఁగునను నామవివృతిని దెలియఁగోరు
వారి కెంతయు నిది యుపకారకంబు ;
జనకుయత్నంబు సఫలత నెనయ దాని
ముద్రిత మొనర్చి భక్తిసంపూర్ణుఁడగుచుఁ
బ్రకటనముఁ జేసె వేంకట భాగవతులు
కడుఁ బ్రయత్నముఁ జేసి లోకంబు పొగడ ;
గ్రంథమంతయుఁ జదివితి శ్రద్ధతోడ
ఘటకుని ప్రయాసమెంతయు గణ్యమనుచు
విన్నవించెద బుధులకు వినయమునను
బండితుల యాదరమునకుఁ బాత్రమగుచు
నాంధ్రదేశంబు నందిది యలరుగాత !

బొబ్బిలి.
11—5—1917.

మండలేముల-సీతారామశాస్త్రి,
సంస్థానాస్థానకవి.

ఈకలియుగమందు భగవన్నామసంకీర్తనమే ముఖ్యమైన మోక్షోపాయము గావున వేదవ్యాసాది మహర్షి ప్రణీతంబగు శ్రీమద్విష్ణుసహస్రనామస్తోత్రముసకలజనులకవశ్యపఠనీయంబు.

"యదధీతమవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే ।
అనగ్నావివశుష్కైధో నతజ్జ్వలతి కర్హిచిత్ ॥"

అన్నట్లర్థజ్ఞానశూన్యమగు శుష్కపారాయణముకంటె నర్థజ్ఞానపూర్వకమగు గ్రంథపఠనము విశేషఫలప్రదమని శాస్త్రము పలుకుచున్నది. శ్రీశంకరాచార్యులవారీసహస్రనామ స్తోత్రమునకు వ్రాసినభాష్యము పండితులకే గాని సంస్కృతభాషాప్రవేశము లేనివారికిఁ దెలియదు. ఇట్టివారి కుపయోగించునటులఁ బూర్వమెవ్వరు నీసహస్రనామములకుఁ దెనుఁగునఁ దాత్పర్యము విశదించి యుండలేదు. చిరకాలము విజయనగరమహారాజ సంస్థాపితాంగ్లేయపాఠశాలలో నాంధ్రభాషోపాధ్యాయులును మాప్రియమిత్రులును నాంధ్రగీర్వాణ భాషలయందు నిష్ణాతులును నగు బ్రహ్మశ్రీ భాగవతుల రామమూర్తి శాస్త్రిగారా కొఱంతతీరునటుల మూలము ననుసరించి చక్కనిశైలితోఁ దెలుఁగున సహస్రనామ తాత్పర్యమును విరచించి లోకోపకృతి నొనరించిరి. ఇంతవఱకప్రకాశితమైయున్న యిట్టి పరమార్థగ్రంథమును సర్వజనోపయోగముగా నిపుడచ్చొత్తించి ప్రకాశింపఁజేసిన శ్రీశ్రీశ్రీ బొబ్బిలి మహారాజా జి. సి. ఐ. ఇ. వారికి మనమందఱ మెల్లపుడుఁ గృతజ్ఞులమై యుండవలయును.

విజయనగరము.
16 జూలై 1917.

మేడేపల్లి, వేంకటరమణాచార్యులు.
మహారాజావారి కాలేజీ
సంస్కృత పండితుఁడు.

శ్రీరస్తు.

# అవతారిక

ధర్మపుత్త్రుండు భీష్మునివలన సమస్తధర్మంబులుం బూర్తిగం దెలిసికొన్నవాఁడై లోకంబుల నన్నిటం బ్రధానదేవుం డెవ్వం డనియు లోకంబునం గలజంతువు లన్నియు ముఖ్యంబుగం బొందఁదగినస్థాన మెద్ది యనియు మానవు లెవ్వానిగుణసంకీర్తనంబు చేసి పూజించుచు శుభంబులం బడయుదు రనియు నిఖిలధర్మంబులలో నుత్తమధర్మం బెయ్యది యనియుం బ్రాణు లెద్దాని జపించి జన్మసంసారంబులం దొలంగి ముక్తు లగుదు రనియు మరల నాఱుప్రశ్నంబులం జేయ నాశాంతనవుండు “గంగాదిపావనతీర్థంబులకంటెం బవిత్రుండును, బ్రహ్మాదిదేవతలలో నుత్తముండును, నిఖిలజంతుజాలంబులకు జనకుండును, జగదుత్పత్తి స్థితినాశంబులకుం గారణుండును. నాశరహితుండును నగు నద్దేవుండు ప్రధానదేవుం డని ప్రథమప్రశ్నంబునకును, సూర్యాది తేజంబులం దేజరిల్లంజేయునట్టి తేజోరూపుండును, అగ్న్యాదిదేవతల భయంబు నొందించెడు తపోమహిమగలవాఁడును, సచ్చిదానందరూపుండు నయిన పరమాత్మయ పునరావృత్తిరహితం బగునుత్తమస్థానం బని రెండవ ప్రశ్నంబునకును, జననమరణాదిషడ్భావవికారంబులం బొరయక వ్యాపనశీలతం బొంది బ్రహ్మాదిదేవతల కధీశ్వరత్వంబు నొందిన యాపరదేవతను నిరంతరము స్తుతింజేయుచు నాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లగు దుఃఖంబుల సంతరించు నని తృతీయప్రశ్నంబునకును, అవ్యయుం డైనదేవుని మానసిక పూజ సేయుచు నట్లు భక్తితో నమస్కరించుచుం బూజ

యొనర్చువాఁడు నిఖిలదుఃఖంబులం దరించు నని నాలుగవ ప్రశ్నంబునకును, భక్తిశ్రోడఁ బుండరీకాక్షుం డైన వాసుదేవుని గుణసంకీర్తనంబుచేఁ బూజించుటయ వేదోక్తంబు లగు నెల్ల ధర్మంబులలో నుత్తమధర్మం బని పంచమప్రశ్నంబునకును, చరాచరరూపం బగుజగంబునకుం బ్రభుఁడును బ్రహ్మాదిదేవతల కధీశ్వరుండును దేశకాల ద్రవ్యంబులవలని భేదంబు నొందని వాఁడును గార్యకారణములకంటె నుత్తముండును, నగుదేవుని సహస్రనామంబులచే స్తోత్రము చేయుచు నిరంతరప్రయత్నము గలపురుషుండు నిఖిలదుఃఖంబుల జయించు నని యాఱవ ప్రశ్నంబునకును గ్రమంబుగ నుత్తరంబు లిడి

శ్లో క ము లు.

ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్।
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్॥ ౧
అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః।
పుమా న్విముచ్యతే సద్య స్సింహత్రస్తై ర్మృగై రివ॥ ౨
హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః॥ ౩
జ్ఞానతో ఽజ్ఞానతో వాపి వాసుదేవస్య కీర్తనాత్।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా॥ ౪
శమాయాలం జలం వహ్నే స్తమసో భాస్కరోదయః।
శాంతిః కలేరఘౌఘస్య నామసంకీర్తనం హరేః॥ ౫
హరేర్నామైవ నామైవ నామైవ మమ జీవనమ్।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥ ౬

గంగాస్నానసహస్రేషు పుష్కరస్నానకోటిషు ।
యత్పాపం విలయం యాతి స్మృతే నశ్యతి తద్ధరౌ ॥ ౭
కలికల్మషమత్యుగ్రం నరకార్తిప్రదం నృణామ్ ।
ప్రయాతి విలయం సద్యస్సకృత్కృష్ణానుసంస్మృతేః ॥ ౮
సకృత్స్మృతోఽపి గోవిందో నృణాం జన్మశతైః కృతమ్ ।
పాపరాశిం దహత్యాశు తూలరాశిమివానలః ॥ ౯
కలావత్రాపి దోషాఢ్యే విషయాసక్తమానసః ।
కృత్వాపి సకలం పాపం గోవిందం సంస్మరన్ శుచిః ॥ ౧౦

అని యనేకస్మృతులు హరినామసంకీర్తనంబు పాపనాశనంబునకు నిదానం బనియు నందుంగోఁ గలియుగంబున మఱియు ముఖ్యసాధనం బనియు నుద్ఘోషింపుచున్నవి గాన, నో ధర్మనందనా ! మహాత్ము లగు వేదవ్యాసాది మహామునులచేఁ బ్రణీతం బగు శ్రీమద్విష్ణుదివ్యనామసహస్రం బాకర్ణింపు మని యుపదేశింపందొడంగ.'' అట్టి శ్రీమద్విష్ణుదివ్యనామసహస్రం బర్థావగాహన పురస్సరంబుగఁ బఠించిన మిగుల శ్రేయోదాయకం బని తలంచి పండితపామరసాధారణం బగునట్లు శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్యవిరచితభాష్యానుసారంబుగ వ్యుత్పత్తులును వానికి నాంధ్రభాషాసంస్కృతం బగునర్థంబును శ్రీసర్వేశ్వరానుగ్రహంబువలన రచియించినాఁడ. పండితోత్తములు దీనం గలదోషంబులం బరిశీలించి నాసాహసంబునకు నసూయం బొరయక నిర్దుష్టంబు గావించి దయ చేయుదురుగాక. మంగళమస్తు. శ్రీశ్రీశ్రీ॥

గ్రంథసంపాదకుఁడు.

శ్రీరస్తు.

శా. శ్రీసంవాసితవక్షు నాశ్రితమనశ్శ్లిష్టేష్టసంధాయకుం
గాసారోద్భవపత్త్రనేత్రుసురసంఘాతార్చితాంఘ్రిద్వయుఁ
దాసౌఘార్ణవతారణైకతరణిం దత్త్వావబోధాప్తికై
వాసోభూషణచందనాదివిధులఁ వాంఛించి యర్చించెదన్.

క. సింహగిరిరాజవాసున
కంహస్సందోహవిపినహవ్యాదునకున్
రంహస్స్వన్నక్తంచర
సంహారున కఖిలభువనసంచారునకున్. ౨

క. నఖరాగ్రభిన్నదనుజున
కఖిలాంతర్యామి కాశ్రితావనరతికిన్
మఖవత్పూర్వజాతసరసిజ
సఖపదునకు సంయమీంద్రసంబోధ్యునకున్. 3

క. శ్రీమద్భాగవతాన్వయ
రామాహ్వయసుకవిహృదయరాజీవలస
ద్ధామునకు నిగమవేద్యున
కామందస్మితవిరాజితాస్యాబ్జునకున్. ౪

చ. నతి యొనరించి మాధవుని నామసహస్రము నిర్వచింప నే
మతిఁ దలపోయుచుండ నసమానచరిత్రులు పూసపాటిసం
తతిజలధీందుమండలులు దానవవైరిపదారవిందసం
దితహృదయాబ్జముద్గజపతిప్రభు లెంతయు సమ్మదమ్మునన్.

ఉ. పండితసార్వభౌమవర । పంకజనాభసహస్రనామముల్
పండితపామరుల్పొగడఁ । బ్రౌఢి మెలర్పఁగ నాంధ్రభాషచే
మండితమై చనన్మధుర । మంజులసూక్తి రచింపుఁడంచునన్
మండనచేలజాలముల । మాన్యునిఁ జేయఁగ నుత్సుకుండనై.

ఆ. తప్పు లెల్ల నొప్పి । దములుగాఁ జేయ
ప్పండితోత్తములను । బ్రస్తుతించి
సూక్తిజాల మెల్లఁ । గూర్తులు సేయని
కజ్ఞులయినకవుల । నభినుతించి. ౨

క. శంకరయతిరాజేంద్రవి
శంకటసూక్తులఁ దలంచి । శంకరసుతు హృ
త్పంకేరుహమునఁ జేరిచి
పొంకముగా నిర్వచింపఁ । బూనితి నెదలోన్. ౩



శ్రీరస్తు.

శ్రీమజ్జగద్రక్షకాయ నమః.

# శ్రీ విష్ణుదివ్యసహస్రనామస్తోత్రమ్.

అస్య శ్రీవిష్ణుదివ్యసహస్రనామస్తోత్రమహామన్త్రస్య । శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః । అనుష్టుప్ఛన్దః । శ్రీమహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా। అమృతాంశూద్భవో భానురితి బీజం । దేవకీనందనస్స్రష్టేతి శక్తిః । ఉద్భవః క్షోభణో దేవ ఇతి మన్త్రః । శంఖభృన్నందకీ చక్రీతి కీలకం । శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రం । రథాంగపాణిరక్షోభ్య ఇతి నేత్రం। త్రిసామా సామగస్సామేతికవచం ।ఆనందం పరబ్రహ్మేతియోనిః। విశ్వరూప ఇతిధ్యానం । ఋతుస్సుదర్శనః కాలఇతి దిగ్బంధః । శ్రీమహావిష్ణు ప్రీత్యర్థే జపే వినియోగః ॥ ధ్యానం ॥ క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణి విలసత్సైకతే మౌక్తికానాం మాలాక్లుప్తాసనస్థస్స్ఫటికమణినిభైర్మౌక్తికైర్మండితాంగః। శుభ్రైరభ్రైరదభ్రైరుపరి విరచితైర్ముక్తపీయూషవర్షైరానందీ నః పునీయాదరినళినగదా శంఖపాణిర్ముకుందః ॥ భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలశ్చంద్రసూర్యౌచ నేత్రే కర్ణావాశాశ్శిరో ద్యౌర్ముఖమపి దహనో యస్యవాస్తేయమబ్ధిః । అంతస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగిగంధర్వదైత్యైశ్చిత్రంరంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥
మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్।
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్ ॥
సశంఖచక్రం సకిరీటకుండలం సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్।
సహారవక్షస్థలకౌస్తుభశ్రియం నమామివిష్ణుంశిరసాచతుర్భుజమ్॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

## శ్రీవిష్ణుదివ్యసహస్రనామస్తోత్ర ప్రారంభః.

వైశంపాయనః

శ్రుత్వా ధర్మానశేషేణ పావనానిచ సర్వశః ।
యుధిష్ఠిరశ్శాంతనవం పునరేవాభ్యభాషత ॥ ౧

యుధిష్ఠిరః.

కిమేకం దైవతం లోకే కింవాప్యేకం పరాయణమ్।
స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాశ్శుభమ్ ॥ ౨
కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ముచ్యతే జంతుర్జన్మ సంసారబంధనాత్ ॥ ౩

భీష్మః.

జగత్ప్రభుం దేవదేవమనంతం పురుషోత్తమమ్।
స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః ॥ ౪

తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్।
ధ్యాయం స్తువన్నమస్యంశ్చ యజమాన స్తమేవచ ॥ ౫
అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్।
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ ౬
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥ ౭
ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః ।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా ॥ ౮
పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్॥ ౯
పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్ ।
దైవతం దేవతానాంచ భూతానాం యోఽవ్యయః పితా ॥ ౧౦
యతస్సర్వాణి భూతాని భవంత్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే ॥ ౧౧
తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్ ॥ ౧౨
యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥ ఓమ్॥ ౧౩
ఓమ్॥ విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ ౧౪
పూతాత్మా పరమాత్మాచ ముక్తానాం పరమా గతిః ।
అవ్యయఃపురుషస్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవచ ॥ ౧౫
యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః ।
నారసింహవపుశ్శ్రీమా న్కేశవః పురుషోత్తమః ॥ ౧౬

సర్వశ్శర్వశ్శివస్స్థాణు ర్భూతాదిర్నిధిరవ్యయః ।
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ ౧౭
స్వయంభూశ్శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ॥ ౧౮
అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః ।
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠస్స్థవిరో ధ్రువః ॥ ౧౯
అగ్రాహ్యశ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూతస్త్రికకుద్ధామ పవిత్రం మంగళం పరమ్॥ ౨౦
ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠశ్శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః॥ ౨౧
ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ ॥ ౨౨
సురేశశ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయస్సర్వదర్శనః ॥ ౨౩
అజస్సర్వేశ్వరస్సిద్ధస్సిద్ధిస్సర్వాదిరచ్యుతః ।
వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః ॥ ౨౪
వసుర్వసుమనాస్సత్య స్సమాత్మా సమ్మితస్సమః ।
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ ౨౫
రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోనిశ్శుచిశ్రవాః ।
అమృతశ్శాశ్వతస్స్థాణు ర్వరారోహో మహాతపాః ॥ ౨౬
సర్వగస్సర్వవిద్భాను ర్విష్వక్సేనో జనార్దనః ।
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః ॥ ౨౭
లోకాధ్యక్షస్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః ॥ ౨౮

భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ ౨౯
ఉపేంద్రో వామనః ప్రాంశురమోఘశ్శుచిరూర్జితః ।
అతీంద్రస్సంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః ॥ ౩౦
వేద్యో వైద్యస్సదాయోగీ వీరహా మాధవో మధుః ।
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥ ౩౧
మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః ।
అనిర్దేశ్యవపుశ్శ్రీమా నమేయాత్మా మహాద్రిధృక్ ॥ ౩౨
మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసస్సతాంగతిః ।
అనిరుద్ధస్సురానందో గోవిందో గోవిదాంపతిః ॥ ౩౩
మరీచిర్దమనో హంస స్సుపర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభస్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ ౩౪
అమృత్యుస్సర్వదృక్సింహః స్సంధాతా సంధిమాన్ స్థిరః ।
అజో దుర్మర్షణశ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ ౩౫
గురుర్గురుతమో ధామస్సత్య స్సత్యపరాక్రమః ।
నిమిషోఽనిమిషస్స్రగ్వీ వాచస్పతి రుదారధీః ॥ ౩౬
అగ్రణీర్గ్రామణీ శ్శ్రీమాన్న్యాయో నేతా సమీరణః ।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్ ॥ ౩౭
ఆవర్తనో నివృత్తాత్మా సంవృతస్సంప్రమర్దనః ॥
అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః ॥ ౩౮
సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృగ్విశ్వభుగ్విభుః ।
సత్కర్తా సత్కృతస్సాధు ర్జహ్నుర్నారాయణో నరః ॥ ౩౯
అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృచ్ఛుచిః ।
సిద్ధార్థస్సిద్ధసంకల్ప స్సిద్ధిద స్సిద్ధిసాధనః ॥ ౪౦

వృషాహీ వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్త శ్శ్రుతిసాగరః ॥ ౪౧
సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూప శ్శిపివిష్టః ప్రకాశనః ॥ ౪౨
ఓజ స్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధస్స్పష్టాక్షరో మంత్రశ్చంద్రాంశు ర్భాస్కరద్యుతిః ॥ ౪౩
అమృతాంశూద్భవో భాను శ్శశబిందుస్సురేశ్వరః ।
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మపరాక్రమః ॥ ౪౪
భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః ।
కామహా కామకృత్కాంతః కామః కామప్రదః ప్రభుః ॥ ౪౫
యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యోఽవ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్ ॥ ౪౬
ఇష్టో విశిష్ట శ్శిష్టేష్ట శ్శిఖండీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః ॥ ౪౭
అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః ॥ ౪౮
స్కందస్స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః ।
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురందరః ॥ ౪౯
అశోక స్తారణ స్తారశ్శూర శ్శౌరిర్జనేశ్వరః ।
అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ ౫౦
పద్మనాభోఽరవిందాక్షః పద్మగర్భశ్శరీరభృత్ ।
మహర్ధి ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ ౫౧
అతులశ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః ।
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాంత్సమితింజయః ॥ ౫౨

విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః ।
మహీధరో మహాభాగో వేగవానమితాశనః ॥ ౫౩
ఉద్భవః క్షోభణో దేవశ్శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః ॥ ౫౪
వ్యవసాయో వ్యవస్థాన స్సంస్థాన స్స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమస్పష్టస్తుష్టః పుష్టశ్శుభేక్షణః ॥ ౫౫
రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః ।
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః ॥ ౫౬
వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః ॥ ౫౭
ఋతుస్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్రస్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ ౫౮
విస్తారః స్థావరః స్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్ ।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ ౫౯
అనిర్విణ్ణః స్థవిష్ఠోభూర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామస్సమీహనః ॥ ౬౦
యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతు స్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ ౬౧
సువ్రతస్సుముఖస్సూక్ష్మ స్సుఘోష స్సుఖద స్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః ॥ ౬౨
స్వాపన స్స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ ౬౩
ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్క్షరమక్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశుర్విధాతా కృతలక్షణః ॥ ౬౪

గభస్తినేమిస్సత్త్వస్థస్సింహో భూతమహేశ్వరః ।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ ౬౫
ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।
శరీరభూతభృద్భోక్తా కపీంద్రో భూరిదక్షిణః ॥ ౬౬
సోమపోఽమృతపస్సోమః పురుజిత్పురుసత్తమః ।
వినయో జయస్సత్యసంధో దాశార్హస్సాత్వతాంపతిః ॥ ౬౭
జీవో వినయితా సాక్షీ ముకుందోఽమితవిక్రమః ।
అంభోనిధిరనంతాత్మా మహోదధిశయోఽంతకః ॥ ౬౮
అజో మహార్హస్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనందో నందనో నందస్సత్యధర్మా త్రివిక్రమః ॥ ౬౯
మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపదస్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాంతకృత్ ॥ ౭౦
మహావరాహో గోవిందస్సుషేణః కనకాంగదీ ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః ॥ ౭౧
వేధాస్స్వాంగోఽజితః కృష్ణో దృఢస్సంకర్షణోఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ ౭౨
భగవాన్ భగహా నందీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతిరాదిత్యస్సహిష్ణుర్గతిసత్తమః ॥ ౭౩
సుధన్వా ఖండపరశుర్దారుణో ద్రవిణప్రదః ।
దివస్పృక్సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః ॥ ౭౪
త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాసకృచ్ఛమశ్శాంతో నిష్ఠా శాంతిః పరాయణమ్ ॥ ౭౫
శుభాంగశ్శాంతిదస్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ ౭౬

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః ।
శ్రీవత్సవక్షా శ్శ్రీవాస శ్శ్రీపతి శ్శ్రీమతాంవరః ॥ ౬౭
శ్రీదశ్శ్రీశ శ్శ్రీనివాస శ్శ్రీనిధి శ్శ్రీవిభావనః ।
శ్రీధర శ్శ్రీకర శ్శ్రేయ శ్శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥ ౬౮
స్వక్షస్స్వంగ శ్శతానందో నంది ర్జ్యోతిర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః ॥ ౬౯
ఉదీర్ణ స్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్థిరః ।
భూశయో భూషణో భూతిర్విశోక శ్శోకనాశనః ॥ ౭౦
అర్చిష్మానర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధో ప్రతిరథః ప్రద్యుమ్నో ఽమితవిక్రమః ॥ ౭౧
కాలనేమినిహా వీర శ్శౌరి శ్శూరజనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ ౭౨
కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః ।
అనిర్దేశ్యవపుర్విష్ణు ర్వీరో ఽనంతో ధనంజయః ॥ ౭౩
బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః ।
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః ॥ ౭౪
మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ ౭౫
స్తవ్య స్స్తవప్రియ స్స్తోత్రం స్తుతి స్స్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః ॥ ౭౬
మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥ ౭౭
సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః ॥ ౭౮

భూతావాసో వాసుదేవ స్సర్వాసునిలయోఽనలః ।
దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాపరాజితః ॥ ౮౯
విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్ ।
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః ॥ ౯౦
ఏకో నైకస్సవః కః కిం యత్తత్పదమనుత్తమమ్ ।
లోకబంధుర్లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ ౯౧
సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చందనాంగదీ ।
వీరహా విషమశ్శూన్యో ఘృతాశీ రచలశ్చలః ॥ ౯౨
అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృక్ ।
సుమేధా మేధజో ధన్య స్సత్యమేధా ధరాధరః ॥ ౯౩
తేజోవృషో ద్యుతిధర స్సర్వశస్త్రభృతాంవరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః ॥ ౯౪
చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః ।
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవిదేకపాత్ ॥ ౯౫
సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ ౯౬
శుభాంగో లోకసారంగస్సుతంతు స్తంతువర్ధనః।
ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ ౯౭
ఉద్భవస్సుందరస్సుందో రత్ననాభస్సులోచనః ।
అర్కో వాజసనశ్శృంగీ జయంతస్సర్వవిజ్జయీ॥ ౯౮
సువర్ణబిందు రక్షోభ్యస్సర్వవాగీశ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ ౯౯
కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః ।
అమృతాశోఽమృతవపుస్సర్వజ్ఞ స్సర్వతోముఖః ॥ ౧౦౦

సులభస్సువ్రత స్సిద్ధశ్శత్రుజిచ్ఛత్రుతాపనః ।
న్యగ్రోధోదుంబరోశ్వత్థశ్చాణూరాంధ్రనిషూదనః ॥ ౧౦౧
సహస్రార్చిస్సప్తజిహ్వస్సప్తైధాస్సప్తవాహనః ।
అమూర్తిరనఘోఽచింత్యో భయకృద్భయనాశనః ॥ ౧౦౨
అణుర్బృహత్కృశస్స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్ ।
అధృతస్స్వధృతస్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ ౧౦౩
భారభృత్కథితో యోగీ యోగీశస్సర్వకామదః ।
ఆశ్రమశ్శ్రమణః క్షామస్సుపర్ణో వాయువాహనః ॥ ౧౦౪
ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః ।
అపరాజితస్సర్వసహో నియంతాఽనియమోఽయమః ॥ ౧౦౫
సత్త్వవాన్ సాత్త్వికస్సత్యస్సత్యధర్మపరాయణః ।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ప్రీతివర్ధనః ॥ ౧౦౬
విహాయసగతిర్జ్యోతి స్సురుచిర్హుతభుగ్విభుః ।
రవిర్విరోచన స్సూర్యస్సవితా రవిలోచనః ॥ ౧౦౭
అనంతో హుతభుగ్భోక్తా సుఖదో నైకజోఽగ్రజః ।
అనిర్విణ్ణస్సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః ॥ ౧౦౮
సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః ।
స్వస్తిదస్స్వస్తికృత్స్వస్తి స్వస్తిభుక్స్వస్తిదక్షిణః ॥ ౧౦౯
అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః ।
శబ్దాతిగశ్శబ్దసహ శ్శిశిరశ్శర్వరీకరః ॥ ౧౧౦
అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః ॥ ౧౧౧
ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణస్సంతో జీవనః పర్యవస్థితః॥ ౧౧౨

అనంతరూపోఽనంత శ్రీర్జితమన్యుర్భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ ౧౧౩
అనాదిర్భూర్భువో లక్ష్మీస్సువీరో రుచిరాంగదః ।
జననో జన జన్మాది ర్భీమో భీమపరాక్రమః ॥ ౧౧౪
ఆధారనిలయోఽధాతా పుష్పహాసః ప్రజాగరః ।
ఊర్ధ్వగస్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ ౧౧౫
ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణజీవనః ।
తత్త్వంతత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః ॥ ౧౧౬
భూర్భువస్స్వ స్తరుస్తారస్సవితా ప్రపితామహః ।
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥ ౧౧౭
యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః ।
యజ్ఞాంతకృద్యజ్ఞగుహ్యమన్న మన్నాద ఏవచ ॥ ౧౧౮
ఆత్మయోనిస్స్వయంజాతో వైఖానస్సామగాయనః ।
దేవకీనందన స్స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ ౧౧౯
శంఖభృన్నందకీ చక్రీ శార్ జ్గధన్వా గదాధరః ।
రథాంగపాణి రక్షోభ్యస్సర్వప్రహరణాయుధః ॥ ౧౨౦

ఓం నమోనమః.

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్ ॥ ౧౨౧
య ఇదం శ్రుణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్కించి త్సోఽముత్రేహచ మానవః ॥
వేదాంతగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధిస్స్యాచ్ఛూద్రస్సుఖమవాప్నుయాత్ ॥

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజాః ॥
భక్తిమాన్యస్సదోత్థాయ శుచిస్తద్గతమానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్ ॥ ౧౨౫
యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతిప్రాధాన్యమేవ చ ।
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ॥
న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విందతి ।
భవత్యరోగో ద్యుతిమాన్బలరూపగుణాన్వితః ॥ ౧౨౭
రోగార్తో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ ౧౨౮
దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ ౧౨౯
వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ ౧౩౦
న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే ॥ ౧౩౧
ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మసుఖక్షాంతిశ్రీధృతిస్మృతికీర్తిభిః ॥ ౧౩౨
న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః ।
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥ ౧౩౩
ద్యౌస్సచంద్రార్కనక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ ౧౩౪
ససురాసురగంధర్వసయక్షోరగరాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥ ౧౩౫

ఇంద్రియాణి మనో బుద్ధి స్సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ ॥ ౧౩౬
సర్వాగమానామాచారః ప్రథమః పరికల్ప్యతే ।
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః । ౧౩౭
ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।
జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥ ౧౩౮
యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాశ్శిల్పాది కర్మచ ॥
వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమే తత్సర్వం జనార్దనాత్ ॥ ౧౩౯
ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ॥
త్రీన్లోకాన్వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః ॥
ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్ ।
పఠేద్య ఇచ్ఛేత్పురుష శ్శ్రేయః ప్రాప్తుం సుఖానిచ ॥ ౧౪౦
విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభవాప్యయమ్ ।
భజంతి యే పుష్కరాక్షం నతే యాంతి పరాభవమ్ ॥ ౧౪౧

మంగళమస్తు॥

ఇతి శ్రీమహాభారతే ఆనుశాసనికే భీష్మయుధిష్ఠిరసంవాదే
శ్రీవిష్ణోర్దివ్యసహస్రనామ స్తోత్రం
సంపూర్ణమ్.



# శ్రీ విష్ణుసహస్రనామ నిర్వచనము

## ౧ వ శ త క ము.

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ఓమ్. | | |
| ౧ విశ్వమ్. | ౧ విశ్వస్యజగతః కారణత్వేన బ్రహ్మవిశ్వ మిత్యభిధీయతే॥ | ౧ జగత్తునకుఁ గారణమగుటచే బ్రహ్మము విశ్వము నాఁబడు. |
| | ౨ పరస్మాత్పురుషాన్న భిన్నం పరమార్థత ఇతి విశ్వమ్॥ | ౨ నిజముగాఁ బరమపురుషునికంటె జగంబన్యంబు కాదు, గాన విశ్వమన బ్రహ్మమనఁబడును. |
| | ౩ విశతీతివిశ్వమ్॥ | ౩ జగత్తునందుఁ బ్రవేశించువాఁడు. |
| | ౪ సంహృతౌ విశంతి సర్వాణి భూతాన్యస్మిన్నితివిశ్వమ్॥ | ౪ ప్రళయమందు జంతువులన్నియు వీనియందుఁ బ్రవేశించును. |
| | ౫ విశ్వశబ్దేన ఓంకారోభిధీయతే తద్రూపత్వాద్విశ్వమ్॥ | ౫ విశ్వమనఁ నోంకారము, ఓంకార రూపుఁడుగాన విశ్వమనఁబడును. |
| ౨ విష్ణుః. | ౧ వేవేష్టీతి విష్ణుః॥ | ౧ వ్యాపించువాఁడు గాన విష్ణువు. [విష్ణువు. |
| | ౨ విశతీతి విష్ణుః॥ | ౨ ప్రవేశించు వాఁడుగాన |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౩ వషట్కారః. | ౧ యదుద్దేశేన వషట్ క్రియతే స వషట్కారః॥ | ౧ ఎవనినుద్దేశించి వషట్టు అనఁగా హావిర్దానము చేయఁబడునో యతఁడు వషట్కారమనఁబడును. |
| | ౨ వషట్కారాది మంత్రాత్మనా దేవాన్ ప్రీణయతీతివషట్కారః॥ | ౨ వషట్కారము మొదలగు మంత్ర రూపము చేత దేవతలను తృప్తి నొందించువాఁడు. |
| ౪ భూతభవ్యభవత్ప్రభుః. | ౧ భూతంచ భవ్యంచ భవచ్చ భూతభవ్యభవంతి - తేషాం ప్రభుః॥ | ౧ భూత భవిష్యద్వర్తమానకాలములనుండువాఁడు. |
| ౫ భూతకృత్. | ౧ భూతానికరోతీతిభూతకృత్॥ | ౧ రజోగుణము నవలంబించి బ్రహ్మ రూపమునఁ బ్రాణుల సృజించువాఁడు. |
| | ౨ భూతాని కృంతతీతి భూతకృత్॥ | ౨ తమోగుణమును బొంది యీశ్వర రూపము చేత జీవులను హింసించువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౬ భూతభృత్. | ౧ భూతానిబిభర్తి పాలయతి ధారయతి పోషయతీతి వా భూతభృత్॥ | ౧ సత్త్వగుణమునొందిజంతువులను భరించువాఁడు లేక పరిపాలనము చేయువాఁడు లేక ధరించువాఁడు లేక పోషించువాఁడు గాన భూతభృత్తనంబడును. |
| ౭ భావః. | ౧ ప్రపంచ రూపేణ భవతీతి భావః॥ | ౧ ప్రపంచరూపముననుండువాఁడు. |
| | ౨ కేవలం భవత్యేవ భావః॥ | ౨ ఒకఁడేయుండువాఁడు. |
| | ౩ భవనంభావ స్సత్తాత్మకో వా॥ | ౩ కలఁడు అనఁగా సత్తారూపుఁడు. |
| ౮ భూతాత్మా. | ౧ భూతానామాత్మాంతర్యామీతివా॥ | ౧ ప్రాణులకు జీవము లేక ప్రాణులలో నుండువాఁడు. |
| ౯ భూతభావనః. | ౧ భూతానిభావయతి వర్ధయతీతివా భూతభావనః॥ | ౧ జీవులను బుట్టించువాఁడు లేక పెంచువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
| --- | --- | --- |
| ౧౦ పూతాత్మా. | ౧ పూతఆత్మా యస్యేతి పూతాత్మా॥ | ౧ గుణములు జన్మము కర్మము దోషము మొదలగున సంబంధముల యొక్క లేమిచేఁ బవిత్రమైన యాత్మ కలవాఁడు. |
| | ౨ పూతశ్చాసావాత్మా చపూతాత్మా॥ | ౨ పవిత్రమైన చైతన్యము. |
| ౧౧ పరమాత్మా. | ౧ పరమశ్చాసావాత్మా చ పరమాత్మా. | ౧ కార్య కారణములుగా కనిత్యమైస్వచ్ఛమై తెలివి కలిగి బంధము లేనట్టి స్వభావము. |
| ౧౨ ముక్తానాం పరమాగతిః. | ౧ ముక్తానాం పరమా ఉత్కృష్టాగతిః గంతవ్యదేవతా పునరావృత్త్యసంభవాత్తస్యేతి ముక్తానాం పరమాగతిః॥ | ౧ మోక్షము నొందినవారికిఁ బొందఁదగిన గొప్పదేవత. అచ్చటికి వెళ్లినవాఁడుతిరిగిరాఁడుగాన, |
| ౧౩అవ్యయః | ౧ నాస్యవ్యయో వికారోవావిద్యత ఇత్యవ్యయః॥ | ౧ వీనికి నాశముగాని మార్పుగాని లేదుగాన నవ్యయుఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౧౪ పురుషః | ౧ పురంశరీరం బ్రహ్మాపురం తస్మిన్ శేతె ఇతి పురుషః॥ | ౧ శరీరమందుఁగాని బ్రహ్మమందుఁగాని నివసించు వాఁడు. |
| | ౨ అస్తె ర్వ్యత్యస్తాక్షర యోగినః ఆసీత్పూరాపూర్వమేవ ఇతి విగ్రహంకృత్వావ్యుత్పాదితః పురుషః॥ | ౨ తారుమారు నొందిన వర్ణములు గల అస్ధాతువు వలనఁబూర్వమందున్నవాఁడు అని చెప్పుటవలనఁబురుషుఁడు. |
| | ౩ పూర్షు పురీషు ఉత్కృష్ట శాలిషు సత్త్వేషు అవసీదతీతివా॥ | ౩ గొప్ప పవిత్రజీవులయందుండువాఁడు॥ |
| | ౪ పురూణి భువనానిసంహారసమయే శ్యతి అంతంకరోతీతివా॥ | ౪ ప్రళయమున లోకములనంతెపుచ్చువాఁడు. |
| | ౫ పురూణి బహూని ఫలాని మనోభిలషితాని సునోతీతివా॥ | ౫ అనేకములగు కోర్కెల నిచ్చువాఁడు. |
| | ౬ పూరణాత్సదనాద్వా పురుషః॥ | ౬ భక్త మనోరథములను బూరించుటవలనఁ గాని భక్త మానసముల |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | | నుండుటవలనఁగాని పురుషుఁడనఁబడును. |
| ౧౫ సాక్షీ | ౧ సాక్షాదవ్యవధానేన స్వరూపబోధేన స్వరూపభేదేన ఈక్షతే సర్వమితిసాక్షీ॥ | ౧ అడ్డులేకుండఁ బ్రత్యక్షముగాతన తెలివినిగాను తన రూపమును గాను సమస్తజగమును జూచువాఁడు. |
| ౧౬ క్షేత్రజ్ఞః | ౧ క్షేత్రంశరీరం జానాతీతి క్షేత్రజ్ఞః॥ | ౧ శరీరమును దెలిసికొనుచున్నవాఁడు అనఁగా శరీరముకలవాఁడనుట. |
| ౧౭ అక్షరః | ౧ నక్షరతీత్యక్షరః॥ | ౧ నాశములేనివాఁడు. |
| ౧౮ యోగః | ౧ యోగేనాప్యతయోయోగః॥ | ౧ మనసుతోఁ గూడ నింద్రియనిగ్రహము చేసి జీవాత్మపరమాత్మలకభేదము కలిగి యుండుటయోగము. ఇట్టియోగముచేఁ బొందఁదగినవాఁడు. |
| ౧౯ యోగవిదాంనేతా | ౧ యోగం విదంతి లభంతేవాయోగవిదః | ౧ యోగమును దెలిసినవారు లేక పొందినవారు |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | తేషాం నేతా | యోగవేత్త లనఁబడుదురు. అట్టియోగులకుఁ బ్రభువు. |
| ౨౦ ప్రధానపురుషేశ్వరః. | ౧ ప్రధానంచ పురుషశ్చ ప్రధానపురుషౌ తయోరీశ్వరః ప్రధానపురుషేశ్వరః॥ | ౧ మాయకును జీవునికిని బ్రభువు. |
| ౨౧ నారసింహవపుః. | ౧ నరస్య సింహస్యచావయవా యస్మిన్ లక్ష్యంతే తన్నారసింహం నారసింహంవపుర్యస్య సనారసింహవపుః॥ | ౧ నరునియొక్కయు సింహముయొక్కయు అవయవములు గల శరీరముగలవాఁడు. |
| ౨౨ శ్రీమాన్. | ౧ యస్యవక్షసి నిత్యం వసతిశ్రీస్సశ్రీమాన్॥ | ౧ రొమ్మునలక్ష్మిగలవాఁడు |
| ౨౩ కేశవః. | ౧ అభిరూపాః కేశాయస్యస కేశవః॥ | ౧ మంచి తల వెండ్రుకలు కలవాఁడు. |
| | ౨ కశ్చ ఈశశ్చ కేశౌ తౌ వశేవర్తయతీతి కేశవః॥ | ౨ బ్రహ్మేశ్వరులను స్వాధీనపరచికొనినవాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | 3 కేశివధాద్వా కేశవః॥ | 3 కృష్ణావతారమున కేశి యను రాక్షసుని జంపినవాఁడు. |
| ౨౪ పురుషోత్తమః. | ౧ పురుషాణాముత్తమః పురుషోత్తమః॥ | ౧ పురుషులలో శ్రేష్ఠుఁడు |
| ౨౫ సర్వః. | ౧ అసతశ్చసతశ్చైవ సర్వస్య ప్రభవాప్యయాత్, సర్వస్యసర్వదాజ్ఞానా త్సర్వమేనం ప్రచక్షతే॥ | ౧ సదసద్రూపమయిన సర్వమునకు నుత్పత్తినాశములను జేయుటను అన్నిటిని దెలిసికొనుటను సర్వుఁడనఁబడును. |
| ౨౬ శర్వః. | ౧ శృణోతి సకలాః ప్రజాః సంహరతీతివా శర్వః॥ | ౧ ప్రజలనందఱను దెలిసికొనువాఁడు లేక సంహరించువాఁడు. |
| ౨౭ శివః. | ౧ నిస్త్రైగుణ్యతయాశుద్ధత్వాచ్ఛివః॥ | ౧ గుణత్రయ రాహిత్యముచే నిర్మలుఁడు. |
| ౨౮ స్థాణుః | ౧ స్థిరత్వాత్ స్థాణుః॥ | ౧ స్థిరుఁడుగాన స్థాణువు. |
| ౨౯ భూతాదిః. | ౧ భూతానామాదిః భూతాదిః॥ | ౧ కారణుఁడౌటవలన జీవులకు మొదటివాఁడు. |
| ౩౦ నిధిరవ్యయః. | ౧ ప్రళయేఽస్మిన్ సర్వం నిధీయత ఇతినిధిః।అ | ౧ ప్రళయమందు వీనియందంతయు నుంచఁబడు |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | వ్యయ ఇతివిశేషణం॥ | ను. అవ్యయమయిననిధి |
| 3౧ సంభవః | ౧ స్వేచ్ఛయా సమీచీనం భవనమస్యేతి సంభవః॥ | ౧ ఇష్టప్రకారము మంచి పుట్టువుగలవాఁడు. |
| 3౨ భావనః. | ౧ సర్వేషాం భోక్తౄణాం ఫలానిభావయతీతిభావనః॥ | ౧ అనుభవించువారి కందఱకు ఫలముల నిచ్చువాఁడు. |
| 33 భర్తా. | ౧ ప్రపంచస్య అధిష్ఠాతృత్వేన ధారణాద్భర్తా॥ | ౧ లోకమునకుఁ బ్రభువగుటవలనభరించువాఁడు. |
| 3౪ ప్రభవః. | ౧ ప్రకర్షేణ మహాభూతాన్యస్మాజ్జాయంతే ఇతి ప్రభవః॥ | ౧ మహాభూతములన్నియు వీనివలన బాగుగనుద్భవిల్లును. |
| | ౨ ప్రకృష్టోభవో౽స్యేతివా॥ | ౨ శ్రేష్ఠమయినజన్మముకలవాఁడు. |
| 3౫ ప్రభుః | ౧ సర్వాసు క్రియాసు సామర్థ్యాతిశయాత్ప్రభుః॥ | ౧ అన్నిపనులయందు మిగుల శక్తిగలవాఁడు. |
| 3౬ ఈశ్వరః | ౧ నిరుపాధిక పరమైశ్వర్యమస్యాస్తీతీశ్వరః | ౧ స్వతంత్రమయిన ప్రభుత్వము గలవాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౩౭ స్వయంభూః | ౧ స్వయమేవ భవతీతి స్వయంభూః॥ | ౧ తనంతటనపుట్టువాఁడు. |
| | ౨ సర్వేషాముపరిభవతీతి స్వయంభూః॥ | ౨ అందఱిమీఁద నుండువాఁడు. |
| | ౩ స్వయమేవస్వతంత్రో భవతిఽపరతంత్ర స్సర్వదేతిస్వయంభూః | ౩ ఎల్లపుడును స్వతంత్రుడు కాని పరాధీనత లేనివాఁడు. |
| ౩౮ శంభుః | ౧ శంసుఖం భక్తానాం భావయతీతిశంభుః॥ | ౧ భక్తుల సుఖమును గోరువాఁడు. |
| ౩౯ ఆదిత్యః | ౧ ఆదిత్యమండలాంతస్థో హిరణ్మయః పురుష ఆదిత్యః॥ | ౧ సూర్యమండలమునబంగారురూపముననుండు పురుషుఁడు. |
| | ౨ అదితేరయంపతి రితివా॥ | ౨ అదితియనభూమి భూపతి యనియుఁ జెప్పఁబడును. |
| | ౩ యథాదిత్యఏకఏవానేకేషు జలభాజనేష్వనేకవత్ప్రతిభాసతే ఏవమనేకేషు శరీరేషు ఏకఏవాత్మానేక | ౩ అనేక జల కుంభముల లో నొకసూర్యునివలె నా నా దేహములలో నొకయాత్మయే పెక్కు తెఱఁగులఁగానుపించును |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
| --- | --- | --- |
| | వత్ప్రతిభాసతే ఇత్యాదిత్య సాధర్మ్యాద్వా॥ | |
| ౪౧. పుష్కరాక్షః | ౧ పుష్కరేణోపమితే ఈక్షణే అస్యేతి పుష్కరాక్ష ॥ | ౧ తామరలవంటి కన్నులు గలవాఁడు. |
| ౪౧ మహాస్వనః | ౧ మహాన్ స్వనః శ్రుతిలక్షణో యస్యసమహాస్వనః॥ | ౧ వేదరూపమయినగొప్ప ధ్వనిగలవాఁడు. |
| ౪౨ అనాదినిధనః | ౧ ఆదిర్జన్మ నిధనం వినాశః తద్ద్వయంయస్యనవిద్యతేసోఽనాదినిధనః॥ | ౧ జననమరణములు లేనివాఁడు. |
| ౪౩ ధాతా | ౧ అనంతాది రూపేణ విశ్వం బిభర్తీతిధాతా॥ | ౧ అనంతుఁడు మొదలగు రూపములచే లోకమును భరించువాఁడు. |
| ౪౪విధాతా | ౧ కర్మణాం తత్ఫలానాంచకర్తావిధాతా॥ | ౧ కర్మములనుకర్మఫలములను గల్పించువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౪౪ విధాతా | ౨ విశేషేణ దధాతీతి వా॥ | ౨ అనంతాదులకంటె గొప్పగ భూమిని మోయువాఁడు. |
| ౪౫ ధాతురుత్తమః | ౧ ధాతుః విరించేరుత్తమః॥ | ౧ చతుర్ముఖుని మీరినవాఁడు. |
| ౪౬ అప్రమేయః | ౧ ప్రత్యక్షాదిభిః ప్రమాణైః ప్రమాతుం యోగ్యోన భవతీత్యప్రమేయః॥ | ౧ ప్రత్యక్షాది ప్రమాణములచేతఁ దెలిసికొనఁగూడనివాఁడు. |
| ౪౭ హృషీకేశః | ౧ హృషీకాణామీశః॥ | ౧ సాక్షిగనుక నింద్రియములకుఁ బ్రభువు అనఁగా జీవరూపుఁడు. |
| | ౨ ఇంద్రియాణియస్య వశే వర్తంతేస పరమాత్మా హృషీకేశః | ౨ ఇంద్రియములను నియమించు పరమాత్మ. |
| | 3 సూర్యరూపస్య చంద్రరూపస్యచ యస్య | 3 సూర్య రూపుఁడును జంద్ర రూపుఁడునగు |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | హృష్టాః కేశా రశ్మయోఽసౌ హృషీకేశః॥ | వీని కాంతులు లోకానందకరములు గాన హృషీకేశుఁడు. |
| ౪౮ పద్మనాభః | ౧ సర్వ జగత్కారణం పద్మంనాభౌయస్యస పద్మనాభః॥ | ౧ ప్రపంచ కారణమగు పద్మము పొక్కిటఁ గలవాఁడు. |
| ౪౯ అమర ప్రభుః | ౧ అమరాణాం ప్రభుః॥ | ౧ దేవతలకు రాజు. |
| ౫౦ విశ్వకర్మా | ౧ విశ్వంకర్మ యస్యస విశ్వకర్మా॥<br>౨ విచిత్రనిర్మాణశక్తిమత్వాద్విశ్వకర్మణా సాదృశ్యాద్వా॥ | ౧ ప్రపంచరూపమయిన పనిగలవాఁడు.<br>౨ చిత్రమైన పనులు సేయుటకు సమర్థుఁడు- లేక విశ్వకర్మతో సమానుఁడు. |
| ౫౧ మనుః | ౧ మననాన్మనుః॥<br>౨ మంత్రోవా ప్రజాపతిర్వామనుః॥ | ౧ తలంచెడువాఁడు.<br>౨ మంత్రము గాని - ప్రజాపతిగాని- కాఁబట్టి మనువు. |
| ౫౨ త్వష్టా | ౧ సంహారసమయేసర్వ | ౧ ప్రళయమందు జీవుల |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | భూతతనూకరణా త్స్రష్టా॥ | నెల్లనుహరించువాఁడు. |
| ౫౩ స్థవిష్ఠః | ౧ అతిశయేన స్థూలః॥ | ౧ మిక్కిలిలావుగల వాఁడు. |
| ౫౪ స్థవిరో ధ్రువః | ౧ పురాణః స్థవిరః-స్థిరత్వాద్ధ్రువః - ఏకం నామస విశేషణం॥ | ౧ ప్రాచీనుఁడైన స్థిరుఁడు విశేషణముతోఁడి పేరు. |
| ౫౫ అగ్రాహ్యః | ౧ ఇంద్రియైర్న గృహ్యత ఇత్యగ్రాహ్యః॥ | ౧ ఇంద్రియములకుఁ బట్టుపడనివాఁడు. |
| ౫౬ శాశ్వతః | ౧ శశ్వద్భవ తీతి శాశ్వతః॥ | ౧ అన్నికాలముల నుండువాఁడు. |
| ౫౭ కృష్ణః | ౧ కృష్ణవర్ణ త్వాత్కృష్ణః॥ ౨ కృషిర్భూవాచక శ్శబ్దో నశ్చనిర్వృతివాచకః । విష్ణుస్తద్భావయోగాచ్చ కృష్ణో భవతిశాశ్వతః॥ | ౧ నల్లని కాంతి గల వాఁడు. ౨ కృషియనభూమి నకారమానంద రూపము. ఈరెంటిమేళనమువలన సదానంద స్వరూపుఁడు. |
| ౫౮ లోహితాక్షః | ౧ లోహితే అక్షిణీయస్యస లోహితాక్షః॥ | ౧ ఎఱ్ఱని కన్నులు గల వాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౫౯ ప్రతర్ద నః | ౧ ప్రళయేభూతాని ప్ర తర్దయతీతి ప్రతర్దనః | ౧ ప్రళయమున జంతువులను హింసించువాఁడు. |
| ౬౦ ప్రభూతః | ౧ జ్ఞానైశ్వర్యాది గుణై స్సంపన్నః ప్రభూతః॥ | ౧ జ్ఞానైశ్వర్యాది గుణములతోఁ గూడినవాఁడు. |
| ౬౧ త్రికకు బ్ధామ | ౧ ఊర్ధ్వాధోమధ్య భేదేన త్రయాణాంలోకానాం తిసృణాంక కుభామపిధామేతి త్రి కకు బ్ధామ॥ | ౧ స్వర్గ మర్త్యపాతాళ ములనెడు మూఁడు లోకములకునుమూఁడు దిక్కులకును స్థానమగువాఁడు. |
| ౬౨ పవి త్రం | ౧ యేనపునాతి-యోవా పునాతి - ఋషిర్దేవ తావాతత్పవిత్రం॥ | ౧ పవిత్రముచేయు దేవతయనికాని - ఋషిరూపుఁడనిగాని చెప్పఁబడువాఁడు. |
| ౬౩ పరమం గళం | ౧ అశుభాని నిరాచష్టే తనోతిశుభసంతతిం। స్మృతిమాత్రేణ య త్పుంసాం బ్రహ్మత | ౧ బ్రహ్మమును స్మరించిన మాత్రానఁ జెడుగులు తొలఁగును. మేలుకలుగును గాన |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | న్మంగళంవిదుః ॥ పరమమితి విశేషణం ॥ | మంగళమనఁబడును. పరమ మంగళ మని విశేషణము. |
| ౬౪ ఈశానః | ౧ సర్వభూత నియంతృత్వా దీశానః ॥ | ౧ అన్ని జీవులకును నియామకుఁడు. |
| ౬౫ ప్రాణదః | ౧ ప్రాణాన్ దదాతిచేష్టయతీతి ప్రాణదః ॥<br>౨ ప్రాణాన్ కాలాత్మనాద్యతి ఖండయతీతి ప్రాణదః ॥ | ౧ ప్రాణములనిచ్చి త్రిప్పువాఁడు.<br>౨ కాలరూపుఁడై ప్రాణములను ఖండించువాఁడు. |
| ౬౬ ప్రాణః | ౧ ప్రాణితీతిప్రాణః ॥ | ౧ జీవించువాఁడు. |
| ౬౭ జ్యేష్ఠః | ౧ వృద్ధతమో జ్యేష్ఠః ॥ | ౧ మిక్కిలి పెద్దవాఁడు. |
| ౬౮ శ్రేష్ఠః | ౧ ప్రశస్యతమఃశ్రేష్ఠః ॥ | ౧ మిక్కిలి మంచి వాఁడు. |
| ౬౯ ప్రజాపతిః | ౧ ఈశ్వరత్వేన సర్వాసాం ప్రజానాంపతిః ॥ | ౧ ఈశ్వరుఁడగుటచే నెల్లజనులకు రాజు. |
| ౭౦ హిరణ్యగర్భః | ౧ హిరణ్మయాండాంతర్వర్తిత్వా ద్ధిరణ్యగర్భః ॥ | ౧ బంగారువికారమయిన గ్రుడ్డునడుమ నుండువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౭౧ భూగర్భః | ౧ భూర్గర్భే యస్యసభూగర్భః ॥ | ౧ భూమిగర్భమునందుఁగలవాఁడు. |
| ౭౨ మాధవః | ౧ మాయాః ధవః మాధవః ॥ | ౧ లక్ష్మీదేవికి భర్త. |
| ౭౩ మధుసూదనః | ౧ మధు నామాసురం సూదితవానితి మధుసూదనః॥ | ౧ మధువనెడు రాక్షసుని సంహరించినవాఁడు. |
| ౭౪ ఈశ్వరః | ౧ సర్వశక్తిమత్తయా ఈశ్వరః॥ | ౧ అన్నిశక్తులుగలవాఁడగుట నీశ్వరుఁడనఁబడు. |
| ౭౫ విక్రమీ | ౧ విక్రమశ్శౌర్యం తద్యోగాద్విక్రమీ॥ | ౧ శౌర్యముగలవాఁడు. |
| ౭౬ ధన్వీ | ౧ ధనురస్యాస్తీతి ధన్వీ॥ | ౧ ధనుస్సుగలవాఁడు. |
| ౭౭ మేధావీ | ౧ మేధాబహుగ్రంథావధారణ సామర్థ్యం సా అస్యాస్తీతి మేధావీ॥ | ౧ అనేక గ్రంథములను దెలిసికొనెడిబుద్ధిగలవాఁడు. |
| ౭౮ విక్రమః | ౧ విచక్రమె జగత్తేన విక్రమః॥ | ౧ జగమున సంచరించువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| విక్రమః | ౨ వినా గరుడపక్షిణా క్రమణాద్వా॥ | ౨ గరుత్మంతునితో సంచరించువాఁడు. |
| ౭౯ క్రమః | ౧ క్రమణాత్క్రమః॥ | ౧ సంచరించువాఁడు. |
| ౮౦ అనుత్తమః | ౧ అవిద్యమాన ఉత్తమో యస్మాత్సోఽనుత్తమః॥ | ౧ వానికంటె నుత్తములు లేరుగాన నను త్తముఁడు. |
| ౮౧ దురాధర్షః | ౧ దైత్యాది భిర్ధర్షయితుం నశక్యత ఇతి దురాధర్షః॥ | ౧ రాక్షసాదులచేఁ బోనివాఁడు. |
| ౮౨ కృతజ్ఞః | ౧ ప్రాణినాం పుణ్యాపుణ్యాత్మకం కృతం జానాతీతికృతజ్ఞః॥ | ౧ ప్రాణుల శుభాశుభ కర్మలను దెలిసికొనువాఁడు. |
| | ౨ పత్రపుష్పాదికమల్పమపి ప్రయచ్ఛతాం మోక్షం దదాతీతి వా॥ | ౨ కొంచెము పువ్వులు పత్తిరి నిచ్చువారికిని మోక్షము నిచ్చువాఁడు. |
| ౮౩ కృతిః | ౧ సర్వాత్మకత్వాత్క్రియాధారత్వేనలక్ష్యత ఇతికృతిః॥ | ౧ సర్వస్వరూపుఁడుగాన పురుష వ్యాపారములకు నాధారభూతుఁ |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | | డై కానుపించు వాఁడు. |
| ౮౪ ఆత్మవాన్ | ౧ స్వమహిమ్ని ప్రతిష్ఠితత్వాదాత్మవాన్॥ | ౧ తనశక్తియం దుండు వాఁడు. |
| ౮౫ సురేశః | ౧ సురాణామీశః॥<br>౨ సూపపదం - రాధాతుః శోభనదాతౄణాం వా ఈశస్సురేశః॥ | ౧ దేవతలకు రాజు.<br>౨ మంచి శుభముల నిచ్చువాఁడు. |
| ౮౬ శరణం | ౧ ఆర్తానామార్తి హరత్వాత్ శరణం॥ | ౨ వెతనొందిన వారికి రక్షకుండు. |
| ౮౭ శర్మ | ౧ పరమానంద రూపత్వాత్ శర్మ॥ | ౧ పరమానంద స్వరూపుఁడు. |
| ౮౮ విశ్వరేతాః | ౧ విశ్వస్య కారణత్వాద్విశ్వరేతాః॥ | ౧ ప్రపంచమునకుఁ గారణ మయిన వాఁడు. |
| ౮౯ ప్రజాభవః | ౧ సర్వాః ప్రజాయత్సకాశాదు ద్భవంతీతి ప్రజాభవః॥ | ౧ ఎల్లజనులు వీనిసమీపమునఁ బుట్టుదురు. |
| ౯౦ అహః | ౧ ప్రకాశ రూపత్వాదహః॥ | ౧ వెలుతురె రూపము గాఁగలవాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
| --- | --- | --- |
| ౯౧ సంవత్సరః | ౧ కాలాత్మనా స్థితో విష్ణుస్సంవత్సర ఇత్యుక్తః॥ | ౧ కాలరూపుఁడై యుండువాఁడుగాన సంవత్సరుఁడనఁబడును. |
| ౯౨ వ్యాళః | ౧ దురాధర భుజంగవత్ గృహీతుమశక్యత్వాత్ వ్యాళః॥ | ౧ పట్టరాని పామువలెఁ బట్ట శక్యము కానివాఁడు. |
| ౯౩ ప్రత్యయః | ౧ ప్రతీతిః ప్రజ్ఞేతి ప్రత్యయః॥ | ౧ ప్రసిద్ధమయిన తెలివి యయినవాఁడు. |
| ౯౪ సర్వదర్శనః | ౧ సర్వదర్శనాత్మకాని అక్షీణియస్య సర్వదర్శనః॥ | ౧ సర్వాత్మగాన నన్నిటిఁజూచెడు నేత్రములు గలవాఁడు. |
| ౯౫ అజః | ౧ నజాయత ఇత్యజః॥ | ౧ పుట్టనివాఁడు. |
| ౯౬ సర్వేశ్వరః | ౧ సర్వేషామీశ్వరాణామీశ్వరత్వాత్సర్వేశ్వరః॥ | ౧ ఎల్ల ప్రభువులకును ప్రభువు. |
| ౯౭ సిద్ధః | ౧ నిత్యనిష్పన్న రూపత్వాత్సిద్ధః॥ | ౧ శాశ్వతముగ నుండు రూపముగలవాఁడు. |
| ౯౮ సిద్ధిః | ౧ సర్వవస్తుషు సంవిద్రూపత్వాత్సిద్ధిః॥ | ౧ అన్నివస్తువులయందు జ్ఞానరూపుఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
| --- | --- | --- |
| | ౨ నిరతిశయ ఫలరూప త్వాద్వాసిద్ధిః॥ | ౨ గొప్ప ఫలస్వరూపుఁడు. |
| ౯౯ సర్వాదిః | ౧ సర్వభూతానామాది కారణత్వా దితి సర్వాదిః॥ | ౧ జీవరాశికి మొట్ట మొదటి కారణము. |
| ౧౦౦ అచ్యుతః | ౧ సర్వరూపసామర్థ్యా న్నచ్యుతో నచ్యవతేనచ్య విష్యతే యస్సోఽచ్యుతః॥ | ౧ తన రూపశక్తి వలన భూతభవిష్య ద్వర్తమాన కాలముల యందు నాశములేని వాఁడు. |

ఇతి శ్రీవిష్ణుదివ్య సహస్రనామ స్తోత్రే ప్రథమశతకవివృతిః.

దశకాదినామములు.

విశ్వం । పరమాత్మా । నారసింహవపుః । సంభవః । మహాస్వనః । మనుః । త్రికకుద్ధామ । భూగర్భః । దురాధర్షః । సంవత్సరః ॥

# తీయ శతకము.

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| ౧ వృషాకపిః | ౧ వృషోధర్మః కపిర్వరాహః వృషరూపత్వాత్కపిరూపత్వాచ్చ వృషాకపిః ॥ | ౧ వృషమనధర్మము, కపి యన వరాహము, ధర్మ రూపుఁడును, వరాహ రూపుఁడును గాన వృషాకపి. |
| ౨ అమేయాత్మా | ౧ ఇయానితి మాతుం నశక్యతే ఆత్మాఅస్యేత్యమేయాత్మా ॥ | ౧ ఇంతదియనినిర్ణయించుటకు శక్యముగాని బుద్ధిగలవాఁడు. |
| ౩ సర్వయోగవినిసృతః | ౧ సర్వసంబంధవినిర్గతః సర్వయోగావినిస్సృతః ॥ | ౧ అన్ని సంబంధముల వలనఁ విడువఁ బడిన వాఁడు. |
| | ౨ నానా శాస్త్రోక్తాద్యోగాదపగతోవా॥ | ౨ అన్ని శాస్త్రముల యందుఁ జెప్పఁబడిన యోగము వలనఁ బట్టువడని వాఁడు. |
| ౪ వసుః | ౧ వసంతి సర్వభూతాన్యత్ర తేష్వయ మపి వసతీతివసుః॥ | ౧ అన్ని జంతువులును వీని యందుండును-లేక యన్నిటి యందితఁ డుండును. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | ౨ వసూనామస్మి పావక ఇత్యుక్తేర్వా వసుః॥ | ౨ వసువులలోఁ బావకుఁడనై తినని భగవద్వచనము వలన వసువు. |
| ౫ వసుమనాః | ౧ వసుప్రశస్తం మనో యస్యస వసుమనాః॥ | ౧ ప్రశస్తమయిన మనసుగలవాఁడు. |
| ౬ సత్యః | ౧ అవితథ రూపత్వాత్పరమాత్మా సత్యః॥ | ౧ పరమాత్మ వ్యర్థరూపుఁడుకాఁడు గాన సత్యుఁడు. |
| | ౨ మూర్తా మూర్తాత్మకత్వాద్వా॥ | ౨ సదసత్స్వరూపుఁడు. |
| | 3 సదితిప్రాణః - తీత్యన్నం-యమితిది వాకిరః తేన ప్రాణాన్నాదిత్యరూపత్వాద్వా॥ | 3 సత్తనఁ బ్రాణము, తియనఁగ నన్నము, యమ్మన సూర్యుఁడు; ప్రాణ రూపుఁడును, అన్న రూపుఁడును, సూర్య రూపుఁడును గాన సత్యుఁ డనఁబడును. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | ౮ సత్సు సాధుత్వాద్వా సత్యః॥ | ౮ మంచివారియందు మంచి వాఁడు. |
| ౭ సమాత్మా | ౧ సమ ఆత్మా యస్యస సమాత్మా॥ | ౧ రాగద్వేషాదులు లేక సమమైన మనస్సు గలవాఁడు. |
| | ౨ సర్వభూతేషు సమ ఏక ఆత్మా వా సమాత్మా॥ | ౨ అన్ని జీవులయందును నేక రూపమగు నాత్మ. |
| ౮ సమ్మితః | ౧ సర్వైరర్థజాతైః పరిచ్ఛిన్నో మిత స్సమ్మితః॥ | ౧ అన్ని వస్తువులతోఁ గూడియున్న వాఁడు. |
| | + అసమ్మిత ఇతి వా పదచ్ఛేదః॥ | + కూడని వాఁడనియుఁ జెప్పవచ్చును. |
| ౯ సమః | ౧ సర్వకాలేషు సర్వ వికార రహితత్వాత్సమః॥ | ౧ అన్ని కాలములను నే వికారము లేని వాఁడు. |
| | ౨ మయాలక్ష్మ్యా సహ వర్తత ఇతి వా సమః॥ | ౨ లక్ష్మితోఁ గూడుకొని యున్న వాఁడు. |
| ౧౦ అమోఘః | ౧ పూజిత స్తుతస్సంస్మృతో వా సర్వ ఫలం | ౧ పూజించిన వారికిఁ గాని, పొగడినవారికిఁ |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | దదాతిన వృథాకరో తీత్యమోఘః॥ | గాని, స్మరించిన వారికిఁ గాని అన్నిఫలములను దప్పకుండ నిచ్చువాఁడు. |
| | ౨ అవితథ సంకల్పత్వా ద్వా॥ | ౨ వ్యర్థము కానితలంపు గలవాఁడు. |
| ౧౧ పుండరీకాక్షః | ౧ హృదయాఖ్యం పుండరీక మశ్నుత ఇతి పుండరీకాక్షః॥ | ౧ హృదయ కమలమున నిండియుండువాఁడు. |
| | ౨ పుండరీకా కారే అక్షిణీ అస్యేతి పుండరీకాక్షః॥ | ౨ తెల్లఁదామరలవంటి కన్నులుగలవాఁడు. |
| ౧౨ వృషకర్మా | ౧ ధర్మ లక్షణం కర్మాస్యేతి వృషకర్మా॥ | ౧ పుణ్యరూప మయిన పనిచేయువాఁడు. |
| ౧౩ వృషాకృతిః | ౧ ధర్మార్థమాకృతిర్యస్య సవృషాకృతిః॥ | ౧ ధర్మార్థ మవతరించు వాఁడు. |
| ౧౪ రుద్రః. | ౧ సంహారకాలే ప్రజాః సంహరన్ రోదయతీతి రుద్రః॥ | ౧ ప్రళయమందుఁ ప్రజలను జంపుచు నేడ్పించువాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
|---|---|---|
| | ౨ రుదంరా తీతివా రుద్రః॥ | ౨ దుఃఖము నిచ్చువాఁడు. |
| | ౩ రుదంద్రావయతీతివా॥ | ౩ దుఃఖమునుగాని దుఃఖకారణమును గాని పోఁగొట్టువాఁడు. |
| ౧౫ బహుశిరాః | ౧ బహూనిశిరాంస్యస్యేతి బహుశిరాః॥ | ౧ అనేకములగు తలలు గలవాఁడు. |
| ౧౬ బభ్రుః. | ౧ బిభర్తి లోకానితి బభ్రుః ॥ | ౧ లోకములను భరించువాఁడు. |
| ౧౭ విశ్వయోనిః | ౧ విశ్వస్య కారణత్వాద్విశ్వయోనిః ॥ | ౧ ప్రపంచమునకుఁ గారణుఁడు. |
| ౧౮ శుచిశ్రవాః | ౧ శుచీ నిశ్రవాం సినామాని శ్రవణీయాన్యస్యేతి శుచిశ్రవాః॥ | ౧ పవిత్రమయిన వినఁదగిన నామములు గలవాఁడు. |
| ౧౯ అమృతః | ౧ నవిద్యతే మృతం మరణ మస్యేత్యమృతః॥ | ౧ చావులేనివాఁడు. |
| ౨౦ శాశ్వతస్థాణుః | ౧ శాశ్వతశ్చా సౌస్థాణుశ్చశాశ్వత స్థాణుః ॥ | ౧ అన్నికాలముల నుండువాఁడును స్థిరుఁడును. |
| ౨౧ వరారోహః | ౧ వర ఆరోహోలోకో ఽస్యేతివరారోహః॥ | ౧ మంచిలోకము గలవాఁడు. |

| నామములు. | వ్యుత్పత్తులు. | తెనుఁగు. |
| --- | --- | --- |
| | ౨ వరమారోహణ మస్మిన్నితివా వరారోహః ॥ | ౨ మంచి యూర్ధ్వగతి వీనియందుఁ గలదుగాన వరారోహుఁడు. |
| ౨౨ మహాతపాః. | ౧ మహత్సృష్టివిషయం తపోజ్ఞానమస్యేతి మహాతపాః ॥ | ౧ సృష్టియందు గొప్ప తెలివిగలవాఁడు. |
| | ౨ ఐశ్వర్యం ప్రతాపో వామహదస్యేతి మహాతపాః ॥ | ౨ ఐశ్వర్యముగాని శౌర్యముగాని గొప్పదిగలవాఁడు. |
| ౨౩ సర్వగః. | ౧ సర్వత్రగచ్ఛతీతి సర్వగః ॥ | ౧ అంతట వ్యాపించువాఁడు. |
| ౨౪ సర్వవిద్భానుః. | ౧ సర్వంవేత్తీతిసర్వవిత్ భాతీతిభానుః - సర్వవిచ్చాసౌ భానుశ్చ॥ | ౧ అన్నిటిని దెలిసినవాఁడును బ్రకాశించువాఁడును. |
| ౨౫ విష్వక్సేనః | ౧ విష్వగంచతి దైత్యసేనాయద్రణే యోగమాత్రేణేతి విష్వక్సేనః॥ | ౧ రాక్షససేన వీనియుద్ధమందు యోగబలముచే నంతట చెదిరిపోవును. |

